శ్రీరస్తు

శుభమస్తు　　అవిఘ్నమస్తు



శ్రీ శంకర భగవత్పాదుల

# భజ గోవిందం

తెలుగు సేత :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech



## భక్తి సూత్రమ్ - భజ గోవింద స్తోత్రమ్

శ్రుతి స్మృతి పురాణానాం
ఆలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదం
శంకరం లోక శంకరమ్

అద్వైతానికి మారుపేరు ఆది శంకరులు. వారు జీవించిన ఏళ్ళు మూడు పదులే అయినా, పదిహేను పదులకు పైగా ప్రామాణిక గ్రంథాలను రచించిన ప్రతిభా మూర్తులు. విశేషించి 70కి పైగా ఆయన స్తోత్ర గ్రంథాలున్నాయి. ఎంత వేదాంతియో అంత మహాకవి కావడం వారిలోని



విలక్షణత. ముఖ్యంగా ఆచార్యుల కవితా శైలి మధుర మనోహరంగా సరళ గంభీరంగా సరసమై చదువరులను భక్తి సూత్రంతో పవిత్రులను చేస్తుంది.

పరమపదానికి సోపానాలు కర్మ జ్ఞాన మార్గాలు. సంసారులకు కర్మమార్గం, యోగులకు జ్ఞాన మార్గం ఆనవాయితీగా అనుసరణీయమై ఉన్నది. మార్గమేదైనా భక్తియే వాటికి ప్రధాన భూమిక. భక్తి భూమికతోనే కర్మ జ్ఞానాలు ఫలవంతాలవుతాయి. అలాంటి భక్తి సూత్రాన్ని చాటేదే భజగోవింద స్తోత్రం.

కాశీ విశ్వేశ్వర దర్శనానికి వెళ్ళుతూ ఆచార్య శంకరులు దారిలో, వ్యాకరణ సూత్రాలను వల్లె వేస్తున్న ఒక వృద్ధుడిని చూసారు. అతడు పదే



పదే పఠిస్తున్న 'డు కృఞ్ కరణే' అనే సూత్రాన్ని విని ఆ వృద్ధుడిని ఉద్దేశించి "రేపో మాపో మరణాన్ని పొందే నిన్ను వ్యాకరణ సూత్రాలు ఏ విధంగాను కాపాడవు. భక్తి సూత్రంతో గోవింద చరణాన్ని శరణు పొందు" అని భజగోవింద స్తోత్రాన్ని రచించారు. ఏ వయస్సులో చేయవలసింది ఆ వయస్సులో చేయాలి, వార్ధక్యంలో జ్ఞానంకంటే భక్తి ముఖ్యం అన్న ఉపదేశం యావద్దేశ మానవులకు అందించారు ఆచార్య శంకరులు.

మాత్రా ఛందస్సులో (చతుర ప్రగతి) మలచబడిన మంచి స్వచ్ఛంద గేయ రచన భజగోవింద స్తోత్రం. "మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది" (శ్రీశ్రీ)

వంటి గేయాల నడకకు 'భజగోవింద స్తోత్రం' మూలికగా కనిపిస్తుంది.

ఈ స్తోత్రాన్ని శ్రీ అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు తెలుగు పద్యాల లోనికి అనువదించడం ఆనందించదగిన అంశం. వృత్తి వేరైనా ప్రవృత్తి పరంగా పద్యవిద్య పట్ల అభిమానం, అభ్యాసదీక్ష కల దీక్షితులు గారు భగవద్గీతను కూడా పద్యాలలోకి అనువదించారు. వారి పద్యాలు సులభ పదాలతో కూడిన భక్తి నైవేద్యాలు. పద్యాల నడకలో, సంధి పదాల ప్రయోగాలలో కొంత సాధన అవసరమని తోచినా, వారి భక్త్యావేశాన్ని పాఠకులు ప్రధానంగా గ్రహించాలి.

ఈ పద్య కృతిని సవరించానని నేనను. అయితే ఈ సత్కృతి క్రతువులో చేయి కలిపే భాగ్య యోగ్యత నాకు దక్కినదని ఆనందిస్తాను.



భగవద్విశ్వాసమే శ్వాసగాగల శ్రీ దీక్షితులు గారు ఇదే కవితా దీక్షతో మరిన్ని దేవతా సంబంధి కృతులను కల్పించాలని ఆశిస్తూ, శ్రీ సరస్వతీ కటాక్ష వీక్షణాలు వారిపై నిండుగా మెండుగా ప్రసరించాలని అభిలషిస్తున్నాను.

ఇట్లు
బుధ విధేయుడు
**జి.ఎం. రామశర్మ**
సంస్కృత అధ్యాపకులు
ప్రభుత్వ మహిళా కళాశాల,
బేగంపేట, హైద్రాబాదు.



## ప్రార్థన

కం॥ శ్రీహరి యిచ్చిన బ్రతుకిది
శ్రీహరి ధ్యానంబుకన్న శ్రేష్ఠతకలదే?
శ్రీహరిని నమ్మువానికి
శ్రీహరె ప్రహ్లాదునట్లు శీఘ్రుమెగాచున్

ఉ॥ చేకొని సత్యమున్ వినుడు చేవను బాసిన వృద్ధులందరున్
వాకిలిలోన మూల్గుచును బావురుమంచని చావుకోసమై
నాకని నాకు నాకనుచు నల్లని కాలుని వేడుకున్ననున్
మీకిపుడీయనంచనుచు మెల్లగ బోవును వేరుఇంటికై



సీ॥ జానెడు పొట్టకు చావని ఆకలి
ఆకలి దీరినన్ సోకె ఆశ
ఆశతో మొదలయ్యె అతివపై వాంఛలు
అతివ వాంఛతొ కల్గెనట్లె బిడ్డ
బిడ్డల కోసమై వేవేల పాట్లయ్యె
పాట్లతో పెరిగెను పాపములును
పాపాలతో హెచ్చె పలురోగములు అవే
రోగాల బ్రతుకుపై రోత బుట్టె

తే॥ బ్రతుకుపై రోత పరమాత్మ బాటకోరె
బాటకోరియు సంసార బంధ మాయె
బంధమూపిరి పోదాక బట్టునాయె
పట్టు వదిలింప గోవింద భజన జేతు

సీ॥ గోవింద దుర్మతిన్ కోపతాపముగల్గె
గోవింద చెడుదారి కోరియుంటి
గోవింద చెడుదారి కూల్చె పుణ్యంబులన్
గోవిందు ధ్యాసపై కోర్కెబోయె
గోవిందు మరువ నన్ కొండంత రోగాలు
గోవింద నిను దాటి కూడె నన్ను
గోవింద గోవింద గోవింద అని ఏడ్తు
గోవింద పాపాలు కూలదన్ను

తే॥ కావుమయ్యరో గోవింద కాల రాయ
కాదు న్యాయము గోవింద కలత జెంద
కావ నీకన్న గోవింద గలరె ఒరులు
కావు కావు కావని జేతు కాకి గోల



కం॥ నా భాగ్యమేమి జెప్పను?
ఈ భజగోవిందమిట్లు ఇమిడెను కవితై
ఏ భయము లేదు నాకిక
ఓ భగవాన్ దీక్షితుల్ని ఒకపరి గనవే

కం॥ అడుగను మేడలు మడులను
అడిగెద కడు జాలిగూడ, అడుసున బడితిన్
అడుగుల వడిచెడి తడబడ
అడిగిన కడు'గడువు'మేలె?అడుగను అడగన్



## అంకితం



శా॥ బాలారిష్టములెన్ని దాటితివి రేపల్లెన్ హరీ! కృష్ణుడై
లీలల్ జూపితివయ్యనాడు సతులున్ రేయెల్ల నీకోసమై
వాలే రెప్పల వేచివేచి కన నిన్ ప్రార్థించిరెన్నో విధుల్
ఆలింపంగ మదీయవేదనలు నీకందింతు నేనీకృతిన్



## భజ గోవిందం

శ్లో॥ భజగోవిందం భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే।
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే॥

తే॥ భజన చేయవె గోవిందు భజన చేసి
మూఢమతి! నీవు గోవిందు మ్రొక్కవేల?
చేరువైనపుడాయువు చివరిమెట్టు
సాయపడబోదు నీ శాస్త్ర సారభమ్ము

తా॥ ఓ మూఢుడా! ఆయువు తీరిపోయి చివరి దశలో ఉన్నావు ఈ వ్యాకరణం నిన్ను కాపాడదు. ఆ గోవిందుని ప్రార్థించుము.

శ్లో॥ మూఢ జహీహి ధనాగమతృష్ణాం
1. కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్ ॥భజ॥

తే॥ మూఢ! మానుము ధనదాహమును మనమున
ఆశ విడనాడి సద్బుద్ధి నలరుమింక
తృప్తి పడుము నీకర్మచే ప్రాప్తమైన
విత్తమును బొంది, చిత్తము వెలుగగలుగ

తా॥ ఓ మూర్ఖ మానవా! నీ మనస్సున ధన దాహమును వదులు. ఆశ విడిచిపెట్టు. సద్బుద్ధి పెంచుకో తృప్తితో నీకర్మవలన పొందిన ధనముతో మనసున సంతసముతో జీవించుము.



శ్లో॥ నారీ స్తనభర నాభీదేశం
2. దృష్ట్వా మాగా మోహావేశమ్,
ఏతన్మాంస వసాదివికారం
మనసి విచిన్తయ వారం వారమ్. ॥భజ॥

తే॥ నారి కుచముల జిగిబిగి నడుమ జనకు
నాభిగని మోహమంది భిన్నంబుగాకు
మాంస వికృతులె అవియని మనసులోన
మఱిమఱెంచుము ఆ పరమాత్మనెంచి

తా॥ స్త్రీ స్తనముల బిగుతుల మధ్య వెళ్ళి బొడ్డు అందాలు చూచి వ్యామోహపడి పాడయి పోవలదు. అవి వికృతమైన మాంసపు ముద్దలని మనసులో మరీ మరీ తెలుసుకో. ఆ పరమాత్మ మేలని తెలియుము.



శ్లో॥ నళినీదళగతజల మతితరళం
3. తద్వజ్జీవిత మతిశయచపలమ్,
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతం చ సమస్తమ్. ॥భజ॥

తే॥ తామరాకుపై జలమట్లు తరళమంచు
అఖిల జీవిత మస్థిరమని తెలియుము
అణగి రోగాల, దురభిమానాతిశయిత
లోకమంత, నిరంతర శోకహతము

తా॥ తామరాకుపై నీటిబొట్టువలె జీవితమంతా అస్థిరం. తగని దురభిమానంతోనూ, రోగాలతోనూ ఎప్పుడూ ఈలోకం శోకమయంగా ఉంది.



శ్లో॥ యావద్విత్తోపార్జన సక్త
4. స్తావన్నిజపరివారో రక్తః
పశ్చాజ్జీవతి జర్జరదేహే
వార్తాం కో పి న పృచ్ఛతి గేహే. ॥భజ॥

తే॥ సంపదలును సంపాదన సాగు వరకె
బంధు పరివారమెల్ల నీప్రక్కనుండు
తరిగిపోవుచో నొకడైన తిరిగిరాడు
ముదిమి పైబడ్డ నినుగను పురుషుడెవడు?

తా॥ ఐశ్వర్యంతో నీసంపాదన జరిగే వరకు నీ బంధుమిత్రులు నీవెంట ఉంటారు. అవి తరిగిపోయాక ఒక్కడైనా నిన్ను చూడడు. ముసలితనం వచ్చిన నిన్ను చూచే మనిషి ఎవడు?

శ్లో|| యావత్పవనో నివసతి దేహే
5. తావత్పృచ్ఛతి కుశలం గేహే,
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే ||భజ||

తే|| ఎంత వరకూపిరుండునో అంతవరకె
నీదు కుశలము జూతురు నీగృహమున
ప్రాణములు పోవ నీదు శవమ్ముజూచి
ప్రాణసతి కూడ భీతిల్లి పారిపోవు

తా|| నీ ఊపిరి ఆడుతున్నంత వరకు అంతా నీఇంటికొచ్చి నీకుశలం అడుగుతారు. ప్రాణం పోయాక నీప్రాణమనుకునే భార్యకూడా నీశవం చూచి భయపడి పారిపోతుంది.



శ్లో|| బాలస్తావ త్క్రీడాసక్తః
6. తరుణస్తావ త్తరుణీసక్తః
వృద్ధస్తావచ్చిన్తాసక్తః
పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః ||భజ||

తే|| బాల్యమంతయు నాటల పాలుగాగ
యౌవనము కామరోగాల తావుగాగ
ముసలితనమంత చింతలు ముసురుకొనగ
పావనాత్మను భావన బడయుటెపుడు?

తా|| చిన్నతనమంతా ఆటలు, యౌవనంలో శృంగారం, ముసలితనంలో బాధలు మరిఇక ఆ పరమాత్మ గురించి ఎప్పుడు ఆలోచిస్తావు.



శ్లో|| కా తే కాన్తా? కస్తే పుత్రః?
7. సంసారో య మతీవ విచిత్రః
కస్యత్వం? కః? కుతాయాతః?
తత్త్వంచిన్తయ తదిహభ్రాతః ||భజ||

తే|| భార్య ఎవ్వతె? పుత్రులన్ వారలెవరు?
ఈ ప్రపంచంబు యునికియే ఎంత వింత?
ఎవరి వాడవు? నెలవేది? ఎవరు నీవు?
సోదరా! చేయరా తత్వ శోధనమును

తా|| ఈ భార్య ఎవరు? పుత్రులెవరు? ఈ ప్రపంచం యొక్క ఉనికి ఎంత వింత? అసలు నీవు ఎవ్వరి వాడవు? ఉండే చోటు ఏది? నీవు ఎవ్వరు? ఓ తమ్ముడూ! ఈ తత్వశోధన ఒకసారి చేయరా.



శ్లో|| సత్సంగత్వే నిస్సంగత్వం
8. నిస్సంగత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చలతత్వం
నిశ్చలతత్వే జీవన్ముక్తిః ||భజ||

తే|| సాధు సంగతివలన నిస్సంగతమగు
దాన మనిషికి నిర్మోహతత్వమబ్బు
నిరతి నిర్మోహ తత్వాన నిశ్చలతయు
గలుగు జీవనముక్తిని గనుట నిజము

తా|| సాధువుల స్నేహంవలన అనురాగ నిర్మూలన, దానివలన మోహం నశించుట, దానివలన నిశ్చలత కలుగుతాయి. దానివలన మనిషి జీవన్ముక్తుడవుతాడు.

శ్లో॥ వయసి గతే కః కామవికారః
9. శుష్కే నీరే కః కాసారః
క్షీణే విత్తే కః పరివారః
జ్ఞాతే తత్త్వే కః సంసారః ॥భజ॥

తే॥ వయసు బోయిన ఆ కామవాంఛబోవు
సారమింకిన పిదప కాసారమేల?
ధనము పోయిన సహచరుల్ దరినిలుతురె?
తత్త్వమెరుగుచో సంసార తాపమగునె?

తా॥ వయస్సుతోపాటు కామ వాంఛ పోతుంది. నీరు ఇంకిన కొలనువల్ల ఉపయోగమేమి? ధనం లేకుంటే సహచరులు నిలుస్తారా? ఈ తత్వం తెలిసినచో సంసార తాప త్రయాలు ఉంటాయా?



శ్లో॥ మా కురు ధన జన యౌవన గర్వం
10. హరతి నిమేషాత్కాలః సర్వమ్,
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥భజ॥

తే॥ కనకు ధన జన యౌవన గర్వమెపుడు
కాల మఖిలమున్ తృటిలోన కాలరాయు
సర్వమిది మాయయని నీవు సారమెరిగి
బ్రహ్మపదమును చేరుము బంధము విడి

తా॥ ధన పరివారములు యౌవనము, అశాశ్వతము. కళ్ళుమూసి తెరిచేంతలో కాలం తరిగిపోతుంది. ఇదంతా మాయ అని గ్రహించి బంధ విముక్తుడవై ఆ పరమాత్మ దారి బట్టుము.



శ్లో॥ దిన యామిన్యా సాయం ప్రాతః
11. శిశిర వసన్తౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయుః
తదపి న ముఞ్చత్యాశా వాయుః ॥భజ॥

తే॥ చూడ, రేబవల్, సాయముషోదయాలు
ఆమనియు, శిశిరంబులు అవని దిరుగు
కాలమాడు నాయుష్యము కరగిపోవు
కాని ఆశాపిశాచమెక్కడికి పోదు

తా॥ చూడగా, రాత్రిపగలు సూర్యోదయ అస్తమయములు, ఋతువులూ ఒకదానివెంట ఒకటి చక్రం వలె తిరిగి తిరిగి వస్తుంటాయి. జీవితంలో కాలం కదిలిపోతే ఆయువు కరిగిపోతూ వుంటుంది. కాని ఆశ మాత్రం పిశాచంలా పట్టుకునే వుంటుంది.



శ్లో॥ కా తే కాన్తా ధనగత చిన్తా
12. వాతుల కిం తవ నాస్తి నియన్తా
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవతరణే నౌకా ॥భజ॥

తే॥ ఏల తరుణీ ధనములకై ఇంత చింత?
లేడె త్రిజగాల శాశించు రేడొకండు?
సాధు సాంగత్యమొక్కటే సర్వజగతి
పడవ యగును సంసారమన్ కడలిదాట

తా॥ స్త్రీ సిరులకోసం ఇంత వ్యామోహం ఎందుకు? ముల్లోకాల ఏలిక అయిన ఆ పరమాత్మ లేడా? సజ్జనుల సాంగత్యం ఈ సంసార సాగరాన్ని దాటించగల పడవ అని తెలుసుకో.

శ్లో॥ జటిలో ముణ్డీ లుంఛిత కేశః
13. కాషాయాంబర బహుకృత వేషః
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తం బహుకృతవేషః ॥భజ॥

తే॥ జడలు పెంచును, బోడియై సన్యసించు
కట్టి కాషాయ వేషము గతులు మార్చు
మూఢుడిల చూసి చూడడు ముక్తి పథము
పొట్ట కూటికై వేషాలు కట్టునెన్నొ

తా॥ జడలు పెంచి యోగివలెనో, బోడి తలతో సన్యాసిగానో, కాషాయము ధరించి రక రకములైన వేషాలు మార్చి మూర్ఖుడు ప్రపంచాన్ని చూచునుగాని ముక్తిని సంపాదించడు. పొట్ట కూటికి వేషాలు మారుస్తుంటాడు.



శ్లో॥ అంగం గళితం పలితం ముణ్డం
14. దశనవిహీనం జాతం తుణ్డమ్
వృద్ధో యాతి గృహీత్వా దణ్డం
తదపి న ముఞ్చత్యాశాపిండమ్ ॥భజ॥

తే॥ వడలె దేహంబు, తలతెల్లబడెను, తుదకు
నడుము వంగెను, పండ్లూడె, నడక కొరకు
చేత బూనెను వృద్ధుడై చేతికర్ర
ఇంత వంతైన జీవికి నిచ్చపోదు

తా॥ దేహమంతా వడలి, ముడతలుబడి, తలనెరిసి, పండ్లూడి నడుము వంగిపోయి, పండిపోయి, నడుచుటకు కర్ర అవసరమైన పండు ముసలిగా మారిపోయినా ఈ జీవికి ఆశ మాత్రం పోవుటలేదు.



శ్లో॥ అగ్రే వహ్నిః పృష్ఠే భానుః
15. రాత్రౌ చుబుకసమర్పిత జానుః
కరతలభిక్ష స్తరుతల వాసః
తదపి న ముఞ్చత్యా శాపాశః ॥భజ॥

తే॥ ముందు చలిమంట, సూర్యుడు పోవనుంట
ముడుచుకొని రాత్రి మేల్కొని మూల్గునంట
చేత చిప్పంట, వాసము చెట్లనుంట
కాని, ఆశతో నరుడట్లె గడుపునంట

తా॥ సూర్యాస్తమయమై ముందు చలిమంటతో రాత్రి ముడుచుకొని నిద్ర పట్టక మూలుగుతూ బ్రతుకుతాడు. చేతిలో చిప్పతో ఎవరు బిచ్చం వేస్తారా అని చెట్ల నీడలో గడుపుతాడు. అయినా మనిషి ఆశవీడడు. అట్లాగే బ్రతుకుతాడు.



శ్లో॥ కురుతే గంగాసాగర గమనం
16. వ్రతపరిపాలన మథవా దానమ్
జ్ఞానవిహీనః సర్వమతేన
ముక్తిం న భజతి జన్మశతేన ॥భజ॥

తే॥ గంగలో మున్గి, సాగర గతులు గల్గి
వ్రతములొనరించి, ధనమును పంచికూడ
జ్ఞానహీనులౌవారు సంసారముక్తి
నూరు జన్మలకైనను నోచుకోరు.

తా॥ గంగాస్నానము, సముద్రస్నానము, వ్రతములు చేయుట, దానములిచ్చుట వలన జ్ఞానములేనివారు సంసార బంధ విముక్తులు కాలేరు. నూరు జన్మలెత్తినా మోక్షము పొందలేరు.

శ్లో॥ సురమన్దిర తరుమూల నివాసః
17. శయ్యా భూతల మజినం వాసః
సర్వ పరిగ్రహ భోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః ॥భజ॥

తే॥ గుడికి చెంతనె నొకచెట్టు 'గూడు' తనకు
పడక నేలపై, చర్మమే వస్త్రమవగ
భోగ సంత్యాగమాను విరాగయోగి
అరయ వైరాగ్య మెవనికీయదు, సుఖమును?

తా॥ గుడిదగ్గర యున్న చెట్టే అతని ఇల్లు. పడక నేలమీద. చర్మమే కట్టుకునే బట్ట. ఆ విరాగి భోగాలను విడనాడి జీవిస్తాడు. చూడగా అట్టి వైరాగ్యం ఎవరికి సుఖము నీయదు?



శ్లో॥ యోగరతో వా భోగరతో వా
18. సంగరతో వా సంగవిహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నన్దతి నన్దతి నన్దత్యేవ ॥భజ॥

తే॥ యోగియైనను నిత్య సంభోగియైన
ఒరుల గూడినన్, బ్రతికిన నొంటిగాను
బ్రహ్మపదమందు నెవని భావము సుఖించు
నట్టి సాధువె ఆనందమందు కొనును.

తా॥ యోగి అయినా, భోగియైనా, సంగుడై జీవించినా, నిస్సంగుడైనా, ఎవరి ధ్యాస బ్రహ్మ పదముపై ఉంటుందో అట్టి సాధువు ఆనందంగా వుంటాడు.



శ్లో॥ భగవద్గీతా కించి దధీతా
19. గంగాజలలవ కణికా పీతా,
సకృదపి యేన మురారి సమర్చా
క్రియతే తస్య యమేన న చర్చా. ॥భజ॥

తే॥ కొంచెమైనను గీతను కాంచునెడల
కొంచెమైనను గంగను గ్రోలు నెడల
కొంచెమైన మురారి నర్చించు నెడల
చర్చనొల్లని యముడైన సహకరించు

తా॥ కొంతసేపైనా గీతా పారాయణ, కొంచెమైనా గంగోదకము గ్రోలుట, కొంచెము కాలమైనా గోవింద నామ స్మరణ చేయవలయును. యమునితో చర్చ సాధ్యం కాదుగదా.



శ్లో॥ పునరపి జననం పునరపి మరణం
20. పునరపి జననీజఠరే శయనమ్,
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయా పారే పాహి మురారే ॥భజ॥

తే॥ మరల జన్మలు మరి మరి మరణములును
తల్లి గర్భాన మ్రగ్గుట తప్పదయ్యె
కష్టతరము సంసారపు కడలినీద
దయను జూపుము మురవైరి! దాట జాల

తా॥ మళ్ళీ జన్మించటం, మళ్ళీ మరణించటం, తల్లి గర్భమనే నరకకూపంలో మ్రగ్గటం తప్పవు. సంసార సముద్రాన్ని ఈదుట చాల కష్టము. ఓ గోవిందా నీవే కరుణించవలెను.

శ్లో॥ రథ్యాచర్పట విరచిత కన్థః
21. పుణ్యాపుణ్య వివర్జిత పన్థః
యోగీ యోగనియోజిత చిత్తో
రమతే బాలోన్మత్తవదేవ. ॥భజ॥

తే॥ దారి దొరికిన పీలికల్ తాధరించు
పాప పుణ్యాలు విడనాడు బాటసారి
మనసు లగ్నమై యోగాన మనును తాను
'పాప' వలె యోగి ఆనంద పరవశుడగు

తా॥ మరి ఆ యోగి ఎలా వుంటాడంటే, దారిలో దొరికిన గుడ్డపీలికలను ధరించును, పాప పుణ్యాలను విసర్జించి మనస్సు యోగంపైనే లగ్నంచేసి చంటి పాపవలె పరవశించి ఆనందముతో కాలము గడుపును.

33

శ్లో॥ క స్త్వం కో హం కుత ఆయాతః
22. కా మే జననీ కో మే తాతః ?
ఇతి పరిభావయ సర్వ మసారం
విశ్వం త్యక్త్వా స్వప్న విచారమ్. ॥భజ॥

తే॥ నీవెవండవు నెలవేది? నేనెవడను
తల్లి ఎవరౌను? ఎవ్వరు తండ్రి నాకు
ననుచు చింతించు సారమావంతలేని
జగతి వింతయైనట్టిదౌ స్వప్నముగను

తా॥ ఓ మనిషీ! నీవు ఎవరివి? ఎక్కడ ఉంటావు? ఈ తల్లి ఎవరు? తండ్రి ఎవ్వడు? అని ఆలోచించి సారములేని సంసారమును విడిచి పెట్టుము ఇది ఒక వింత కల అని గ్రహించుము.

34

శ్లో॥ త్వయి మయి చాన్యత్రైకో విష్ణుః
23. వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః,
భవ సమచిత్తః సర్వత్ర త్వం
వాఞ్ఛస్యచిరా ద్యది విష్ణుత్వమ్. ॥భజ॥

తే॥ అలరు నీలోన నాలోన హరియొకండె
సహనమెంచుము కోపము చాలు చాలు
అచిరకాలాన విష్ణుత్వమందగోర
సర్వ విధముల సమబుద్ధి సబబు నీకు

తా॥ నీలోను, నాలోను ఉన్న గోవిందుడొక్కడే. క్రోధము విడనాడి సహనశీలివై యుంటే త్వరలోనే ఆయనను సాధించగలవు. అన్ని విధములా నీకు సమబుద్ధి తగినది.

35

శ్లో॥ శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ
24. మా కురు యత్నం విగ్రహ సన్ధౌ,
సర్వస్మిన్నపి పశ్యాత్మానం
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానమ్. ॥భజ॥

తే॥ శత్రుమిత్ర బాంధవ పుత్రజనులతోడ
గొడవపడి, అశాంతిని తెచ్చుకోకు నరుడ!
ఆత్మసములుగా నందరి నాదరించి
భేద బుద్ధిని వీడుము మోదమలరు

తా॥ శత్రువులతోగాని, మిత్రులతోగాని, బంధువులతోగాని, కొడుకులతో గాని గొడవపడి అశాంతి తెచ్చుకోవలదు. భేద బుద్ధిని వీడి అందరినీ ఆత్మీయుల వలె చూచి సంతసమున కాలము గడుపుము.

36

శ్లో॥ కామం క్రోధం లోభం మోహం
25. త్యక్త్వా త్మానం పశ్యతి సో హమ్,
ఆత్మజ్ఞాన విహీనా మూఢాః
తే పచ్యన్తే నరకనిగూఢాః ॥భజ॥

తే॥ కామ,క్రోధము,లోభమోహములు వీడి
ఆత్మలోన సో హమ్భావమందు మోయి!
ఎంచి చూడనాత్మజ్ఞాన హీనమతులు
నరక కూపాన మ్రగ్గుచు పరముగనరు.

తా॥ కామ క్రోధ మోహ లోభములనే అంతః శత్రువులను జయించి ఆ బ్రహ్మమే నేను అనే భావన కలిగియుండవలెను. అట్లు ఆత్మజ్ఞానం లేని అల్పులు నరక కూపంలో మగ్గుతూనే వుంటారు.



శ్లో॥ గేయం గీతా నామసహస్రం
26. ధ్యేయం శ్రీపతిరూప మజస్రమ్,
నేయం సజ్జన సంగే చిత్తం
దేయం దీనజనాయ చ విత్తమ్. ॥భజ॥

తే॥ పాడవలె వేయి మారులు పరమగీత
తలపవలె విష్ణురూపు సంతతము మదిని
చేర్చవలె సాధుసంగతి చిత్తసుమము
ఈయవలె దీనులకు విత్తమింపుగలుగ

తా॥ వేయిమారులు గీతా పారాయణ చేయవలెను. ఎల్లప్పుడూ విష్ణు ధ్యానమున కాలము గడువవలెను. మనస్సనే పుష్పమందు సాధువుల చెలిమి నుంచవలెను. దీనులకు సంతోషముతో సహాయం చేయవలెను.



శ్లో॥ సుఖతః క్రియతే రామాభోగః
27. పశ్చాద్ధన్త శరీరే రోగః
యద్యపి లోకే మరణం శరణం
తదపి న ముఞ్చతి పాపాచరణమ్ ॥భజ॥

తే॥ ముద్దరాలితో ముదముగా భోగమూని
వేగముడుగగా దేహాన రోగమూని
మరణమే శరణమ్మని అరసికూడ
మానడయ్యయో! పాపాల మానవుండు

తా॥ సంతోషంగా స్త్రీలతో సుఖించి, వయసు వాడి, వేగము తగ్గి, శరీరం రోగాల రొంపిగా మారి, మరణం ఎందుకు రాదురా దేవుడా అనుకుంటూ కూడా ఈ మానవుడు పాపాలను వదలడు. అయ్యయ్యో.



శ్లో॥ అర్థ మనర్థం భావయ నిత్యం
28. నాస్తి తతః సుఖలేశః సత్యమ్,
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః. ॥భజ॥

తే॥ ధనము చెడ్డది నిరతము తగదు నరుడ!
సుఖము లేదురా దానితో సుంత యయిన
ధనముగల వారికౌను పుత్రాళివలన
భీతి తప్పదు, లోకాన రీతి ఇదియె

తా॥ ఎప్పటికీ నరులకు ధనము చాల చెడ్డది. ఎప్పుడూ దానిమీద ధ్యాసవలదు. దాంట్లో కొంచెంకూడా సుఖం లేదు. ఈమాట నిజం. ధనముంటే స్వంత కొడుకుల వల్ల కూడా హాని జరుగుతుంది అనే భయం తప్పదు. ఇది లోకపు రీతి.

శ్లో॥ ప్రాణాయామం ప్రత్యాహారం
29. నిత్యానిత్య వివేకవిచారమ్
జాప్యసమేత సమాధివిధానం
కుర్వవధానం మహదవధానమ్ ॥భజ॥

తే॥ నిత్యమెరిగియు మరియుననిత్య మెరిగి
మదిని గెల్చి ప్రాణాయామమార్గమూని
జపముతో కూడిన సమాధి సాధనమున
చిత్త జాగ్రత్త చేత సచ్చిత్తు గనుము.

తా॥ ఓ నరుడా! నిత్యమైనదేదో, అనిత్యమైనదేదో తెలుసుకొని మనస్సును జయించి ప్రాణాయామము వంటి సాధనలచే జపతపముల నాచరించుచు యోగ సమాధి సాధించి మనోజ్ఞానముతో సత్తు చిత్తు తెలుసుకొనుము.



శ్లో॥ గురుచరణాంబుజ నిర్భరభక్తః
30. సంసారాదచిరా ద్భవ ముక్తః,
సేన్ద్రియ మానస నియమా దేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్ ॥భజ॥

తే॥ గురువు పాదారవిందముల్ గొలిచిభక్తి
మోహ సంసారబంధ విముక్తి గనుము
మనసు నింద్రియములనియమంబు నుంచి
నీదునెదనున్న బ్రహ్మను నీవెకనుము

తా॥ గురువు యొక్క పాద పద్మములను భక్తితో పూజించి మోహకారణమైన సంసార బంధ విముక్తిని పొందవలెను. మనసును ఇంద్రియాలను నిగ్రహించి నీ హృదయంలో నెలకొన్న ఆ బ్రహ్మను దర్శించుము.



## తుది వినతి

'క్రియేటివిటి' అంటుంటారు. దానికి సరిపోయే పదం 'సృజనాత్మకత' అది భగవద్దత్తమైనది. దాన్ని వాడుకోవటం మనిషిలోవున్న ఆ 'దేవుడు' చేసే చిత్రం. ఒకడు బాంబు తయారుచేసి నరమేధం చేస్తాడు. ఒకడు పాటకి అద్భుతమైన రాగం కట్టి మనను తన్మయులను చేస్తాడు. రెండూ భగవంతుడు ఇచ్చిన శక్తులే. వాటిని పదిమందికి మంచి జరిగేట్లు చేసే క్రియేటివిటీ కావాలి.

ఒకరోజు భజగోవిందం వింటున్నాను. "నహినహిరక్షతి' డుకృఞ్ కరణే" అనే చరణాన్ని నహి నహి రక్షతి 'ఎమ్‌టెక్ డిగ్రీ' అని చదివాను. ఎంతో ఆనందం కలిగింది. భజగోవిందం చదివే కొంతమందికి మాత్రం దాని అర్థం తెలియదు



కాని 'డుకృఞ్ కరణే' అంటారు. నేడు ఆ 'డుకృఞ్ కరణే' ని మార్చి ప్రజలకు అర్థమయ్యేలా చెప్పాలి.

ఆదివారం నుంచి రోజు కొక దేవుణ్ణి కొలిచినా ఏడురోజులు చాలటంలేదు. అందుకని రోజూ మనం అర్థం తెలియని శ్లోకాలు చదువుతున్నాం. ఉదాహరణకి "మాంగల్యం తంతునానేనా..." కి బదులు "మాంగల్యంతంతునేవున్నా..." అని చదివితే ఆ వరుణ్ణి తప్పు పట్టవద్దు. అతని ధ్యాస వేరే విషయాలపై వుంది. శరీరం అలసిపోయి వుంది. ఇకవాక్కు ఎలా సరిగా వుంటుంది. మంత్రాలు, శ్లోకాలూ అదేపనిగా భట్టీయంవేస్తే లాభంలేదు.

శ్రీశంకర భగవత్పాదుల విరచిత "భజగోవిందం" నాకిష్టం. దాన్ని తెలుగు చేయాలని

భగవన్నిర్దేశం అయి నాలోని 'వాడి' కి ఆదేశం వెళ్ళింది. అన్నీ వాటంతట అవే సమకూరినవి. భజగోవిందం తాత్పర్య సహితం దొరకటం, వాటికి పద్యాలు కూర్చి తాత్పర్యం దానికి జతకూడేట్లు వ్రాయటం జరిగింది. శతావధాని శ్రీ రామశర్మ గారి పరిచయ భాగ్యం కలుగుట వారు ప్రేమగా పద్యాలను సంస్కృత సారూప్యంగా చెక్కడం, దానిని ముద్రించ గలిగే శక్తి ఆ గోవిందుడీయుట చేత ఇది మీ చేతిలో వుంది.

ఈ భజగోవిందంలో కొన్ని శంకరుని ప్రియ శిష్యులైన పద్మపాదుని వంటివారు శ్లోకాలు తాముకూడా ఆ వృద్ధునికి చెప్పినట్లు ఇంకొక కథ ఉన్నది. ఏది ఏమయిన ఇది జ్ఞానామృతం. సంసార బంధ విమోచకరం. సత్య దర్పణం.



భ్రమలను సమూలంగా నిర్మూలించే పరమౌషధం. దీన్ని సేవించండి. ఎన్నిసార్లు తీసుకుంటే అంత మంచిది. జబ్బు తగ్గటమే కాదు మళ్ళీ రాకుండా జేసే శక్తి దీనికుంది.

ఈ భజగోవింద పాఠ్యము పొందుపరుప బడిన శ్లోకములలో 12వది (కాతె కాన్తా) పద్మపాదుడు, 13వది (జటిలోముణ్డీ) తోటకాచార్యులు, 14వది (అన్గళితం) హస్తమలికాచార్యులు, 15వది (అగ్రేవహిః) సుబోధుడు, 16వది (కురుతే గంగాసాగర) వార్తిక కారులు, 17వది (సురమన్దిర తరుమూల) నిత్యానందుడు, 18వది (యోగరతోవా) ఆనందగిరిస్వామి, 19వది (భగవద్గీతా కించిత్) దృఢ భక్తస్వామి, 20వది (పునరపిజననం) నిత్యానందులు, 21వది (రథ్యాచర్పట)



యోగానందులు, 22వది (కస్త్వంకో హం) సురేంద్రుడు, 23వది (త్వయిమయి) మేధాతిథి, 25వది (కామం క్రోధం) మరియు 26వది (గేయంగీతా) భారతీవంశుడు చెప్పినవి అని తక్కినవి జగద్గురు శంకరాచార్యులు చెప్పినట్లు ఇంకొక సంగతి ప్రచారములో నున్నది.

మనపాపాయి నడక నేర్చుకుంటూ పడిపోతే తిట్టం కదా పైగా సముదాయించి మళ్ళీ నడు అని ప్రోత్సహిస్తాం. అలాగే ఇందులో తప్పులుంటే మన్నించి ఆ గోవిందుని కృపతో వ్రాసిందిగా భావించి మనసారా ఆశీర్వదించండి. ఆ గోవిందునికి సదా మ్రొక్కండి.

మరొక్కసారి శ్రీరామశర్మగారికి నా ధన్య వాదములు తెలుపుకుంటూ ముగిస్తాను.



**ఇది**

**జగద్గురు శ్రీఆదిశంకరాచార్య**

**భగవత్పాదులు రచించిన**

# భజ గోవిందం

**సర్వేజనా సుఖినోభవంతు**